ఓం

# ఆత్మానాత్మవివేకము

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య

ప్రణీతము

నెల్లూరి యొద్దనుండు కోవూరిలో

ప్రబుద్ధాశ్రమముననుండు

కోవూరు పట్టాభిరామశర్మచే

ఆంధ్రీకృతము

ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రచురింపఁబడినది.

 1919 [దీనివెల 2 అణాలు

శ్రీరామ.

# ఆత్మానాత్మవివేకము.

హరిః ఓమ్

ఆత్మకు దుఃఖమేల కలిగినది? ఆత్మకు శరీరపరిగ్రహము వలన దుఃఖము గలిగినది. శరీరపరిగ్రహము దేనిచేతఁ గలుగుచున్నది? కర్మముచేత. కర్మము దేనివలన గలుగుచున్నది? రాగాదుల వలన. (రాగాదులనగా—రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారమునను నవి.) రాగాదులు దేనివలనఁ గలుగుచున్నవనిన నభిమానము వలన గలుగుచున్నవి. అభిమానము దేనివలనఁ గలుగుచున్నది? అవివేకమువలన. అవివేకము దేనివలనఁ గలుగుచున్నదనిన నజ్ఞానము వలనఁ

గలుగుచున్నది. అజ్ఞానము దేనిచేతఁ గలుగుచు న్నదనినచో నది దేనిచేతనుఁ బుట్టదు. అజ్ఞాన మనాదియు ననిర్వచనీయమును. అజ్ఞానము వలన నవివేకము పుట్టుచున్నది. అవివేకమువల న నభిమానము పుట్టుచున్నది. అభిమానము వలన రాగాదులు పుట్టుచున్నవి. రాగాదులవల నఁ గర్మము పుట్టుచున్నది. కర్మమువలన శరీర పరిగ్రహము గలుగుచున్నది.

దుఃఖమెప్పుడు పోవును ? శరీరపరిగ్రహము మొదలుచెడ నశించెనేని దుఃఖము నివర్తించును. 'మొదలుచెడ' ననుమాటయెందుకు ? నిద్రావ స్థ యందు దుఃఖము నివర్తించి నప్పటికిని తిరిగి మెలఁకువ గలుగు సమయమున నది పుట్టుచు న్నందు వలన సుషుప్తియందు శరీరపరిగ్రహము

వాసనారూపమున నుండుచున్నది. అందువలన దానిని తొలఁగించుటకే 'మొదలుచెడ' నను పదము. మొదలుచెడ శరీరపరిగ్రహము మానె నేని దుఃఖమునకు నివృత్తి గలుగును. శరీర పరిగ్రహ మెప్పుడు మానును? మొదలుచెడఁ గర్మము నివర్తించెనేని శరీర పరిగ్రహ నివృత్తి గలుగును. కర్మ నివృత్తి యెప్పుడు గలుగును? మొదలు చెడ రాగాదులు నివర్తించెనేని కర్మని వృత్తి గలుగును. ఎప్పుడు రాగాది నివృత్తి యగును? మొదలు చెడ నభిమానము నివర్తించి నప్పుడు రాగాది నివృత్తి యగును. అభిమాన నివృత్తి యెప్పుడగును? మొదలు చెడ నవివేక ము నివర్తించి నప్పు డభిమానము నివర్తించు ను. అవివేక నివృత్తి యెప్పుడగును? మొదలు

చెడ నజ్ఞానము నివర్తించి నప్పుడవివేక నివృత్తి యగును. అజ్ఞాన మెప్పుడు నివర్తించును? బ్రహ్మమును నాత్మయును నొక్కటేయను జ్ఞానము గలిగి నప్పుడు మొదలు చెడ నజ్ఞానము నివర్తించును.

సరేగాని, సంధ్యావందనాది నిత్యకర్మములు విధి విహితములగుటవలన వానిచేత నవిద్యా నివృత్తి గావచ్చునే-జ్ఞానముతో నేమిపని? యందువేనిఁ గర్మములచే నవిద్యా నివృత్తి కాదు. అదియేలయనిన, కర్మమునకును నజ్ఞానమునకును విరోధములేదు. జ్ఞానమునకును నజ్ఞానమునకును విరోధము. కావున జ్ఞానము చేతనే యజ్ఞానమునకు నివృత్తి. ఆ జ్ఞాన మెట్లు కలుగుననిన విచారము చేతనే కలుగును. విచారము సేయు నప్పుఁ

డధికారి? సాధన చతుష్టయసంపన్నుఁడు. సాధన చతుష్టయమన నేది? నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫల భోగవిరాగము, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము ననునవి. నిత్యానిత్యవస్తువివేక మనగా—బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్యయను నిశ్చయమే, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగమనగా—ఇచ్చట నీలోకమునందు దేహధారణమునకుఁ గావలసినంతకు మించిన స్రక్చందనవనితాది విషయములయందు కక్కిన కూటియందును మలమూత్రాదులయందును న్వలె నిచ్ఛలేకుండుట యిహలోకఫలభోగ విరాగము; అచ్చట స్వర్గలోకమునందు రంభా సంభోగాది విషయములందును నట్లే యిచ్ఛలే కుండుట యముత్రఫలభోగవిరాగము. శమాది

షట్కమనగా—శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ యనునవి. శమ మన నంతరింద్రియ నిగ్రహము; అంతరింద్రియ మనఁగా మనస్సు. దానిని నిగ్రహించుట యన గా శ్రవణము మొదలగునవి కాని విషయముల నుండి దానిని మఱలించుట. దమమనగా శ్రవ ణాదులయందుంచుట. ఉపరతి యనగా విహిత కర్మములను విధ్యుక్తరీతినిఁ బరిత్యజించుటయు శ్రవణాదులయందే యనురక్తిగలిగియుంచుట యును. తితిక్షయనగా శీతోష్ణాదులోర్చుకొను టయు దేహవిచ్ఛేదమొనర్చు పురుషుని నిగ్ర హింపఁదనకుశక్తియుండియు నట్టి పరాపరాధము నోర్చుకొనుటయును. - సమాధానమనగా శ్రవ ణాదుల యందుంచు మనస్సు వాసనావశమున

విషయములయందుఁ బోయినప్పుడెల్లను దోష దృష్టిచేదానిఁ నావిషయములనుండి మఱలించుట. శ్రద్ధయనఁగా గురు వేదాంత వాక్యములయందత్యధికమగు విశ్వాసము ఇదేశమాదిషట్కమనబడునది. ముముక్షుత్వమనగా మోక్షము నందతితీవ్రమగు కోరిక. ఇది సాధనచతుష్టయసంపత్తి. ఇదిగలవాఁడు సాధనచతుష్టయ సంపన్నుఁడు. వానికే యాత్మానాత్మవిచారమునందధికారము. అన్యునకులేదు. అట్టివాఁడాత్మానాత్మ విచారణమునే చేయవలసినది. బ్రహ్మచారికి వేదాధ్యయనమునకన్నను చేయఁదగినపని మఱియొకటి లేనియట్లు వానికినిఁ జేయఁదగిన పని మఱేమియునులేదు. గృహస్థులకు సాధనచతుష్టయసంపత్తి లేకున్నను నాత్మానాత్మవిచా

రము చేయుటచే దోషమేమియునులేదు. అంత యేకాదు. దానివలన వారికిమిగుల శ్రేయస్సును గలుగును. గురుశుశ్రూషవలన ప్రాప్తమైన భక్తి యుక్తమగు వేదాంతశ్రవణము ప్రతిదినమును చేయుట యెనుబదికృచ్ఛ్రవ్రతము లొనర్చుటవలనఁ గలుగు ఫలము నిచ్చునని చెప్పఁబడియున్నది. ఇందువలన సందఱును నాత్మానాత్మ విచారమును చేయవలసినదని యేర్పడుచున్నది.

ఆత్మ యనఁగా స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూఁడింటికిని వేఱై, పంచకోశములు గాక, యవస్థాత్రయ సాక్షియైయుండు సచ్చిదానందరూపుఁడు. అనాత్మ యనగా యనృతజడదుఃఖాత్మకమగు సమష్టివ్యష్టిరూప శరీరత్రయము. శరీరత్రియమనగా స్థూలశరీరము, సూక్ష్మ

శరీరము, కారణశరీరము ననుమూఁడుశరీరములు.

స్థూలశరీరమనగా- పంచీకృత మహాభూత ములవలననై, కర్మమువలనఁబుట్టి, జన్మాదిషడ్భావవికారరూపమై యుండునది. పంచీకరణము నందును నిట్లే చెప్పఁబడియున్నది. ఒక్కొక్క భూతమును రెండుపాళ్ళుచేసి యందు మొదటి పాలు తిరిగి నాలుగుపాళ్ళుచేసి యా నాలుగింటి ని తన్ను విడిచి మిగత నాలుగుభూతములలోని రెండవపాళ్ళలో కలుపుటచే నైదైదు లిరువది యైదు భాగముల కూడికయగు పంచీకృత మహాభూతములవలనఁ బుట్టి పూర్వకర్మార్జితమై సుఖదుఃఖభోగసాధనమైన యీశరీరమే స్థూల శరీరము. బాల్య కౌమార యౌవన వార్ధక్యాది వయోవస్థావిశేషములచే శిథిలమగు

నది యగుట నిది శరీర మనఁబడుచున్నది. దహ ధాతువు బూడిదగాచేయుటయందు వర్తిం చుం గాన నీ స్థూలశరీరము భస్మభావమును పొందునది యగుట దీనికి స్థూలదేహమనియుం బేరు. అట్లనినచోఁ గొన్ని దేహములు దహన ముచేయఁబడి భస్మమగుచున్నవి. మఱికొన్ని భూస్థాపితము లగుటవలన మన్నగుచున్నవే- అన్ని స్థూలదేహములును భస్మమగుచున్నవని వానికి దేహశబ్దప్రయోగ మెట్లొప్పుననిన వినుము. అన్ని స్థూలశరీరములును నగ్నిచేఁ గాల్పబడక పోయినను వానికి దాహ్యత్వము వేఱు విధము గాఁ గలుగుచున్నది - అవి యాధ్యాత్మికాధి భౌతికాధిదైవికములను తాపత్రయ రూపమగు నగ్నిచేఁ గాల్పఁ బడుచుండుటంబట్టి వానికి

దేహాశబ్దము చెల్లుచున్నది. ఆధ్యాత్మికమనగా - ఆత్మ ననగా దేహము నధికరించి యుండునది యధ్యాత్మము - దానిచేఁ గలిగింపబడిన దుఃఖ మాధ్యాత్మికము—శిరోరోగాదికము. అధిభూతమనగా భూతము నధికరించి యుండునది. అధిభూతముచేఁ జేయఁబడునది యాధిభౌతికము. వ్యాఘ్ర తస్కరాదులవలనఁ బుట్టు దుఃఖము. ఆధిదైవికమనగా—దేవుని నధికరించి యుండునది యధిదైవము - అధిదైవముచేఁ జేయఁబడునది యాధిదైవికము - ఆ దుఃఖము పిడుగుపడుట మొదలగు వాని వలనఁ బుట్టునది.

సూక్ష్మశరీర మనగా—అపంచీకృతభూతకార్యము - పదునేడవయవములతో జేరినది. ఇదే లింగశరీరము - ఆ పదునేడవయవము లేవి య

న్న — జ్ఞానేంద్రియములైదు - కర్మేంద్రియములైదు, ప్రాణాది వాయువులైదు, మనస్సు, బుద్ధి, యనునివి*. జ్ఞానేంద్రియము లేవి? శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు. ఇందు శ్రోత్రేంద్రియమనగా—చెవిగాక చెవి నిమిడియుండు నాకాశము నాశ్రయించి శబ్దమును గ్రహించు శక్తిగల యింద్రియము శ్రోత్రేంద్రియము. త్వగింద్రియమనగా—త్వక్కుగాక త్వక్కునాశ్రయించి సర్వశరీరమును వ్యాపించి స్పర్శగ్రహణశక్తిగల యింద్రియము త్వగింద్రియము. చక్షురింద్రియమనగా - కన్నుగాక కనుగ్రుడ్డు నాశ్రయించి కృష్ణ

---

*పదునేడను పక్షమున చిత్తాహంకారములు మనోబుద్ధులలోఁ గలిపి లెక్కచేయుచున్నారు. పక్షాంతరమున నివి వేఱుగాఁగొన్ని పందొమ్మిది యనుచున్నారు.

తాదాగ్రవర్తియై రూపాదులను గ్రహించుశక్తి
గల యింద్రియము చక్షురింద్రియము. జిహ్వేం
ద్రియమనగా- నాలుకగాక కొననాలుకనుండి ర
సాదులను గ్రహించు శక్తిగల యింద్రియము జి
హ్వేంద్రియము. ఘ్రాణేంద్రియమనగా- ముక్కు
గాక కొనముక్కుననుండి గంధాదులను గ్రహిం
చు శక్తిగల యింద్రియమని చెప్పఁబడుచున్నది.
కర్మేంద్రియములేవి? వాక్పాణి పాదపాయూపస్థ
లనునవి. ఇందు వాగింద్రియమనగా- వాక్కుగా
క ఎనిమిదిచోట్లనుండిశబ్దము నుచ్చరించుశక్తిగల
యింద్రియము వాగింద్రియము. ఎనిమిది చోట్ల
నఁగా - హృదయము, కంఠము, శిరము, పెదవు
లు, నాసిక, దవడలు, దంతములు, నాలుక,
యనునవి. పాణీంద్రియమనగా - చేయిగాక య

ఱచేతి నాశ్రయించి యిచ్చుట, పుచ్చుకొనుట, పట్టుట, యను నీపనులు చేయు శక్తిగల యిం ద్రియము పాణీంద్రియము. పాదేంద్రియ మనఁ గా - పాదముగాక యుంకాలి నాశ్రయించి రాక పోకలు చేయు శక్తిగల యింద్రియము పాదేంద్రియము. పాయ్వింద్రియ మనగా - గు దముగాక గుదము నాశ్రయించి యుండి మలవి సర్జనముచేయుశక్తిగల యింద్రియము పాయ్విం ద్రియము. ఉపస్థేంద్రియమనగా- నుపస్థగాక యో ని ద్వారము నాశ్రయించి మూత్రశోణితశుక్ల ములను విడుచు శక్తిగల యింద్రియ ముపస్థేం ద్రియము. ఇవి కర్మేంద్రియములని చెప్పఁబడు చున్నవి. అంతఃకరణ మనగా మనస్సు, బుద్ధి, చిత్తము నహంకారమునననువి. మనస్సనగ స్థా

నము గళాంతరము - బుద్ధికి ముఖము - చిత్తము నకునాభి- అహంకారమునకు హృదయము. అంతఃకరణచతుష్టయమునకు విషయములు క్రమముగా సంశయనిశ్చయధారణాభిమానములు. ప్రాణాదివాయుపంచకమనఁగా - ప్రాణాపానవ్యానోదాన సమాన రూపములు - వానిస్థానవిశేషములేవనిన - హృదయమున ప్రాణవాయువు, గుదమున నపానము, నాభిని సమానము, కంఠదేశమున నుదానము,సర్వశరీరమున వ్యాపించి వ్యానము నుండును. వానికి విషయము లేవనిన - ప్రాణ మూర్ధ్వగతి గలది, అపాన మధోగతి గలది, వ్యానము వ్యాప్తిగలిగినది, ఉదాన ముత్క్రాంతిచేయునది - సమానము సమముగా చేయునది. వాని కుపవాయువు లైదు. నాగ

కూర్మ కృకర దేవదత్త ధనంజయ వాయువులని వానిపేర్లు. వానికి విషయము లేవనిన - నాగ వాయువునకు దగ్గుట, కూర్మవాయువునకు ఱెప్ప లాఱ్చుట, కృకరవాయువునకు తుమ్ముట, దేవ దత్తవాయువునకు నావులించుట, ధనంజయ వాయువునకు మృతమైనను దేహమును విడువక పోషించుటయు విషయములని వేదవిదు లెఱుం గుదురు. ఈ జ్ఞానేంద్రియాదులకు వరుసగా నధి పతులు — జ్ఞానేంద్రియములకు దిక్కులు, వా యువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినీదేవత లును ; కర్మేంద్రియములకు నగ్ని, యింద్రుడు, విష్ణువు, మృత్యువు, ప్రజాపతియును ; అంతః కరణ చతుష్టయమునకు చంద్రుడు, బృహస్పతి, క్షేత్రజ్ఞుఁడు, నీశ్వరుడును ; ప్రాణాదిపంచకము

నకు విశిష్టుఁడు, విశ్వకర్త, విశ్వయోని, యజుఁడు, జయుఁడును నధిష్ఠానదేవతలని మునీశ్వరులు చెప్పుదురు. ఇది యంతయును గలిసి లింగశరీరమనఁబడుచున్నది. ఇట్లే చెప్పబడియున్నది చూడుడు.

శ్లో॥ పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియసమన్వితం।
అపంచీకృతభూతోత్థంసూక్ష్మాంగంభోగసాధనం॥

అనఁగా పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియములతోఁ గూడి యపంచీకృతభూతములవలనఁ బుట్టినది సూక్ష్మశరీరము. ఇది జీవునకు భోగసాధనము. లీనమైన విషయమును పొందించునది యను వ్యుత్పత్తిచేత నిదిలింగమనఁబడుచున్నది. లీనమగుదాని నిది యెట్లు పొందించుచున్నది? శ్రవణమననాదులచేతఁ బొందించుచున్నది - అ

నంగా, గుఱుతింపఁజేయుచున్నది. శిథిలమగునది గనుక శరీర మనువ్యుత్పత్తిచేత నిది శరీరమనఁబడుచున్నది. ఇదియెట్లు శిథిలమగుచున్నదనిన, నేను బ్రహ్మమైతినను బ్రహ్మాత్మైక్యజ్ఞానముచేత శిథిలమగుచున్నది. పెఱుగుట భస్మమగుట యను 'దిహ' 'దహ' ధాతువుల వ్యుత్పత్తిచేత లింగదేహమునకు వృద్ధిపురస్సరమైన నాశము చెప్పఁబడుచున్నది. వృద్ధి యనఁగానెట్లు? పున్నమచంద్రునివలె పరిణమించుట. దాని సంకోచమేశిథిలమగుట.

కారణశరీరమనఁగా — ఈ శరీరద్వయమునకు హేతువును, ననాదియు, ననిర్వచనీయమును, నాత్మాభాసముతోఁ గూడినదియు, బ్రహ్మాత్మైక్యభావముచేత నివర్తించునదియునగు నజ్ఞానమే

కారణశరీర మనఁబడుచున్నది. ఇట్లే చెప్పఁబడి యున్నది చూడుము.

శ్లో. అనాద్యవిద్యాఽనిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే। ఉపాధిత్రితయా దన్యమాత్మాన మవధారయేత్॥

అనఁగా ననాది, యనిర్వాచ్యము నగు నవిద్య కారణోపాధి యనంబడుచున్నది. ఈమూఁడుపాధులకన్న వేఱుగా నుండుదానిని నాత్మయని తెలిసికొన వలసినది. శిథిలమగునది యను వ్యుత్పత్తిచేత నిది శరీర మనఁబడుచున్నది. అదెట్లనిన - బ్రహ్మాత్మైక్య జ్ఞానముచేత నిది శిథిలమగుచున్నది. 'దిహ' 'దహ' యను ధాతువుల వ్యుత్పత్త్యర్థముచేత దీనికివృద్ధి పూర్వకమగు డియము చెప్పఁబడుచున్నది.

ఈయనాత్మ యనృతజడ దుఃఖాత్మకమని గదా చెప్పబడినది? అనృత మనఁగా, కాలత్రయమునందును లేని వస్తువు. జడ మనఁగా- తననుగాని యన్యమునుగాని యెఱుగని వస్తువు. దుఃఖమనఁగా నప్రీతిరూపమైన వస్తువు- ఇదిసమష్టివ్యష్ట్యాత్మక మనిచెప్పఁబడినది. సమష్టియనునేది? వ్యష్టియననేది? వనము సమష్టి- వృక్షము వ్యష్టియు, జనసమూహము సమష్టి యొక్కమనుష్యుఁడు వ్యష్టియునైనట్లనేక శరీరములు సమష్టి- యొక్కశరీరము వ్యష్టి.

అవస్థాత్రయ మనఁగా జాగ్రత్స్వప్నసుషుప్తులు. ఇంద్రియములచేవిషయములను గ్రహించుట జాగ్రదవస్థ. జాగ్రదవస్థలో ననుభవించిన విషయముల సంస్కారమువలనఁ బుట్టినది స్వప్న

ము. సర్వవిషయ జ్ఞానాభావముసుషుప్తి. జాగ్రత్తు,స్థూల శరీరము, దీనికభిమాని విశ్వుడు. స్వప్నము, సూక్ష్మ శరీరము, దీనికభిమాని తైజసుడు. సుషుప్తి, కారణ శరీరము, దీని కభిమాని ప్రాజ్ఞుడు.

పంచకోశములనగా-అన్నమయప్రాణమయ మనోమయవిజ్ఞానమయానందమయము లనునవి యైదు. అన్నమయకోశ మనగా నన్నవికారము, ప్రాణమయము ప్రాణవికారము, మనోమయము మనోవికారము, విజ్ఞాన మయము విజ్ఞాన వికారము, ఆనందమయ మానందవికారము. అన్నమయకోశమనబడునది యీస్థూలశరీరము. ఎట్లన, తలిదండ్రులన్నముదినగా నది శుక్లశోణితరూపము నొందును. వానిరెండింటి కూడికచేతనే దే

హారూప మేర్పడుచున్నది. తిత్తివలె కప్పుకొని యుండునది యగుటచే దీనికిఁ గోశమనిపేరు- ఇ ది యన్నవికారమగుచు నాత్మను గప్పుచున్నది. ఎట్లనఁగా వేఱుపడని యాత్మనువేఱుపడ్డ వానివ లెను, జన్మాది (జన్మ వృద్ధి పరిణ త్యపక్షయ వ్యాధి నాశములను) షడ్భావ వికారములు లేని యాత్మ నవి గలవానివలెను, తాపత్రయాదులు లేని యాత్మ నవిగలవానివలెను,వజ్ర కత్తినివలె, పొట్టు బియ్యమును వలె, పిండమును మాఱు తిత్తివలె మఱుగు పఱచుచున్నది. ప్రాణమయ కోశమనగా- కర్మేంద్రియము లైదును ప్రాణా దులైదు వాయువులు ననునీవన్నియుం గలిసి ప్రాణమయకోశ మనఁబడుచున్నది. అదిప్రాణ వికారమగుచుండ వక్తృత్వాది రహితుడగు నా

త్మను వ_క్తనువలెను, దానాది రహితుడగు నా
త్మను దాతనువలెను గమనాగమనశూన్యుఁడ
గు నాత్మను గంతనువలెను, క్షుత్పిపాసాదిరహి
తుఁడగు నాత్మను క్షుత్పిపాసాదులు గలవానివ
లెను కనఁబడునట్లు కప్పుచున్నది. మనోమయ
కోశమనగా జ్ఞానేంద్రియములై దును మనస్సును
చేరి మనోమయ కోశమగుచున్నది. ఎట్లనిన న
దిమనోవికార మగుచుండ సంశయాది రహితుఁ
డగునాత్ముని సంశయాది వంతునిగా, శోకమో
హాది రహితుఁడగు నాత్ముని శోకమోహాది స
హితునిగా, దర్శనాది రహితుఁడగు నాత్ముని ద
ర్శనాదివంతునిగా నగపడునట్లావరించుచున్నది.
విజ్ఞానమయకోశమనగా, జ్ఞానేంద్రియము లై దు
ను బుద్ధియుంజేరి విజ్ఞానమయ కోశ మనఁబడు

చున్నది. ఇది విజ్ఞాన వికారమైయుండి కర్తగాని యాత్మను కర్తనుగాను, నవిజ్ఞాతుఁడగు నాత్మని విజ్ఞాతునిగాను, నిశ్చయరహితు నాత్మని నిశ్చయవంతునిగాను మాంద్యజాడ్యాది రహితుఁడగు నాత్మను మాంద్యజాడ్యాది సహితునిగాను నగపఱచుచుండగపచ్చుచున్నది. ఆనందమయ కోశము నగా (ఇష్టార్థ దర్శన ప్రాప్త్యనుభవ జన్యములగు) ప్రియ మోద ప్రమోద వృత్తులు గలిగి యజ్ఞానప్రధానమగు నంతఃకరణమే యానందమయకోశము. ఎట్లనగా, ప్రియమోదప్రమోదరహితుఁడగు నాత్మను ప్రియమోదప్రమోదసహితునిగను, భోక్తగాని యాత్మను భోక్తనుగాను, పరిచ్ఛిన్నసుఖరహితు నాత్మను పరిచ్ఛిన్నసుఖ సహితునిగాను నగపఱచుచు నాచ్ఛా

దించు చున్నది. ఆత్మ శరీర త్రయ విలక్షణుఁ డని చెప్పబడు చున్నాడు. ఎట్లన్న - శబ్దప్రయోగము వలన, వస్తువిమర్శవలన, లోకప్రతీతి వలనను నాత్మ శరీర త్రయ విలక్షణుఁడు. ఆత్మ విలక్షణుఁడని యెట్లు తెలిసికొన వలసిన దన గా- సత్తను శబ్ద మసత్తను శబ్దము గాదు. అసత్తను శబ్దము సత్తనుశబ్దముగాదు. చిత్తను శబ్దముజడమను శబ్దముగాదు. జడమను శబ్దము చిత్తను శబ్దముగాదు. సుఖమనుశబ్దము దుఃఖమను శబ్దము గాదు. దుఃఖమనుశబ్దముసుఖమనుశబ్దము గాదు. శబ్ద ప్రయోగమువలన నాత్మ శరీరత్రయ విలక్షణుడగుట యిట్లు. ఇఁకను వస్తువిమర్శచేత నాత్మ శరీరత్రయ విలక్షణుఁడని చెప్పఁబడుచు న్నాడు. ఎట్లనగా, లేనివస్తు వున్నవస్తువుగాదు.

ఉన్నవస్తువు లేనివస్తువుగాదు. వేఱుసాధనమును కోరకయే తనంతట తాను ప్రకాశించునట్టి వస్తువు ప్రకాశించకుండు వస్తువు కాదు, ప్రకాశించకుండునట్టి వస్తువు వేఱుసాధన మపేక్షించకయే తనంతటతాను ప్రకాశించుచుండు వస్తువుకాదు. దుఃఖరూపమైన వస్తువు సుఖరూపమైన వస్తువు కాదు, సుఖరూపమైనవస్తువు దుఃఖరూపమైన వస్తువు కాదు. ఆత్మ వస్తువిమర్శనచే శరీరత్రయ విలక్షణుండగుట యీలాగుఁ జెప్పి లోకప్రతీతి చేత నాత్మ శరీరత్రయ విలక్షణుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఎల్లనిప — సత్యముగాఁ దోచునది యసత్యముగాఁ దోచునది గాదు, అసత్యముగాఁ దోచునది సత్యముగాఁదోచునదిగాదు. చిత్తుగాఁ దోచునది జడముగా దోచునదిగాదు,

జడముగాఁదోచునది చిత్తుగా తోచునదిగాదు సుఖముగాఁ దోచునది దుఃఖముగాఁ దోచునది గాదు, దుఃఖముగాఁదోచునది సుఖముగాఁ దోచునది గాదు. ఈ ప్రకారముగా నాత్మకు శరీర త్రయ విలక్షణత్వమునుఁజెప్పి యతనికి నవస్థా త్రయ సాక్షిత్వము చెప్పఁబడుచున్నది. ఎట్లన గా — జాగ్రదవస్థ వచ్చినది - జాగ్రదవస్థ వచ్చుచున్నది - జాగ్రదవస్థ రాబోవుచున్నది. స్వప్నావస్థ వచ్చినది - స్వప్నావస్థ వచ్చుచున్నది - స్వప్నావస్థ రాబోవుచున్నది. సుషుప్త్యవస్థ వచ్చినది - సుషుప్త్యవస్థ వచ్చుచున్నది - సుషుప్త్యవస్థ రాబోవుచున్నది యని యిట్లవస్థాత్రయము నాత్మ నిర్వికారుఁడై తెలిసికొనుచున్నాడు; కావున నతఁడవస్థాత్రియ సాక్షి.

తరువాత నాత్మకుఁ బంచకోశ విలక్షణత్వమెట్లు చెప్పఁబడుచున్నదనిన దృష్టాంతరూపమున నది నిర్ణయము చేయఁబడుచున్నది. నాది యీ యావు, నాది యీ దూడ, నా కొడుకు వీఁడు, నాకూతు రిది, నాభార్య యిది, యనుచు నా లాటి పదార్థము గలవాఁ డాపదార్థముగాడు; వాఁ డాపదార్థములకంటెను వేఱైనట్లు నా యన్నమయకోశము, నా ప్రాణమయకోశముఁ నా మనోమయకోశము, నా విజ్ఞానమయకోశ ము, నా యానందమయకోశము నని యిట్లు పంచకోశములు గలవాఁ డాత్మ పంచకోశము లు గాడు - వానికంటె విలక్షణుఁడై సాక్షి య గును. ఇందుకు

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం

తథాఽరసం నిత్య మగంధవచ్చయత్ ।
అనాద్యనంతం మహతఃపరం ధ్రువం. "

ఆత్మశబ్దములేనిది-స్పర్శములేనిది-రూపములేనిది-అవ్యయము - రసములేనిది - నిత్యము - గంధముగలదిగాదు - అనాది - అనంతము - మహత్తునకన్న నవ్వలిది - ధ్రువము - అను నర్థము గల, యీ మొదలగు శ్రుతులు ప్రమాణములు. అందువలన నాత్మకు సచ్చిదానందరూపము చెప్పబడినది. సద్రూపత్వ మనఁగా - దేని చేతను బాధింపఁబడక మూఁడుకాలములయందును నేకరూపముననుండుట. చిద్రూపత్వమనగా-వేఱుసాధన మపేక్షింపక తనంతటతాను ప్రకాశించుచుండునదియై తనయం దారోపింపఁబడిన సర్వపదార్థములనుఁ బ్రకాశింపఁజేయు వస్తు

క. కనఁదగు వినఁదగు నరయం
గనుఁదగు ధ్యానింపఁదగునుగదవెయాత్మానే
యని యాత్మా నాత్మ విమ
ర్శనమున శ్రుత్యర్థమెల్ల గ్రథితంబయ్యెన్.

తే. గీ. వేదభూమిచతుర్ముఖ విధుసమాంక
హాయనసంవత్సరమునగీర్వాణమునకు
బాలురకుఁగూడ దెలిసెడుపగదిఁదెలుఁగు
వ్రాసె కోవ్వూరి పట్టాభిరామశర్మ.

శ్రీగురుపాదుకార్పణమస్తు

సీ. శ్రీ శంకరాచార్యకృతి యిది యనియు ని
ట్లాంధ్రీకృతంబయ్యె ననియు నెఱిగి
లోకోపకారంబుగాకని యిది యచ్చు
వేయించి ప్రచురింప వేడిదాని
కగువిత్తము నొసంగినట్టి వివేకినుల్

దామరమడుగను గ్రామమందు
వసియించు శ్రీ తిరువెంకటప్ప కామమ్మయు
నామె పుత్రికయీశ్వరమ్మయగుట
తే. గీ. వీరికారోగ్య భాగ్యముల్ సిరుల వంశము
భక్తి చిత్తవిశుద్ధియు పరమధర్మ
బుద్ధియుఁ బ్రజలఁ జేయాకయుఁ బుగనొసంగి
బ్రోచుఁగాత పరమేశ్వరుండు కృపను.

స్వస్తిరస్తు.



